

# భాగవత ఖండనము

మహర్షి దయానంద సరస్వతి
విరచితము

అనుకర్త :
"కళాప్రపూర్ణ" డా. పం. గోపదేవ్

ప్రకాశకులు :
**ఆర్యసమాజము**
**కూచిపూడి - 522 313**

రూ. 3/-

# పరిచయము

భాగవతమనగా నేమి? భగవంతునకు సంబంధించినది. అనగా భగవంతుని గూర్చి వేదమున కవిరుద్ధముగా విస్పష్ట ముగా తెలియజేయునది. అట్టిది సంస్కృతములో నున్నదా? సంస్కృతములో 'భాగవతము' అను పేరుతో దేవీభాగవతము, కృష్ణభాగవతము అను గ్రంథములు రెండు కలవు. ఇందేది వ్యాసకృతము? లేక రెండును వ్యాసకృతములా? అను సం దేహము పాఠకులకు గలుగుట సహజము. ఆ సందేహనివృత్తి చేయుటకొఱకే శ్రీ మద్దయానంద సరస్వతి సంస్కృతమున భాగవత ఖండనమను గ్రంథమును రచింప దానిని తెలుగులో "కళాప్రపూర్ణ" బిరుదాంకితులు, దార్శనికులునైన పండితగోపదేవ్ గారు అనువదించిరి.

ఇందు దేవీభాగవతము వేదమున కవిరుద్ధముగా నుండుటచేత వ్యాసకృతమనియు, నదియే భాగవతనామమున కర్హ మనియు నిర్ధరించిరి. మఱియు కృష్ణభాగవతములో శబ్ద దోషములు, విషయదోషములు, పరస్పర విరుద్ధవచనములు, వేదవిరుద్ధము లగువానిని వ్యాకరణశాస్త్రము ద్వారాను, యుక్తి మూలముననను, ఉదాహరణముల ద్వారాను, ఉపనిషత్తులు, భగవద్గీత, భారతము, మనుధర్మశాస్త్రము మున్నగు ప్రమాణ ముల ద్వారాను వెల్లడించిరి.

మఱియు పాషండులన నెవరో వారి చేష్టలేవియో కూడ విశదీకరించి వారి మార్గముల ననుసరించినవారికి దుర్గతి తప్ప

సద్గతి కలుగనేరదనియు వివరించిరి. మోక్షమును కాంక్షించు వారు జ్ఞానము సంపాదింపవలసినదే యనియు జ్ఞానములేకుండ భక్తి, పూజ మొదలగు వానిద్వారా భగవత్సాక్షాత్కారము కాని, మోక్షము కాని యసంభవమనియు సప్రమాణముగా నిరూపించిరి.

అంతియే కాక వేదములు, ఉపవేదములు, వేదాంగములు, మనుస్మృతి, మహాభారతము, హరివంశ పురాణము, వాల్మీకి విర్మిత రామాయణము ననువాని పఠనపాఠనములు, శ్రవణ శ్రావణములు మాత్రమే చేయవలయునుగాని కృష్ణ భాగవతము మొదలగు గ్రంథ పఠన పాఠనాదులు కాని, శ్రవణ శ్రావణములు కాని చేయరాదని నిషేధించిరి సద్గ్రంథములు పఠించిన వారికి శుభములు చేకూరుననియు రచించిరి. కావున పాఠకులు ఈ గ్రంథము నందలి సత్యవిషయములు గ్రహించి సన్మార్గగాములై భగవంతుని దయవలన సుఖింతురు గాక !

అరమండ్ల వెంకయార్య

ఓ౩మ్

# భాగవత ఖండనము

సం :- శ్రీమన్ భాగవతం పురాణం నామ కిమస్తి ?కుతః సందేహః ? ద్వే భాగవతే శ్రూయేతే - ఏకం దేవీభాగవతం; ద్వితీయం కృష్ణభాగవతం చేతి. అతో జాయతే సందేహః అనయోః కిమస్తి వ్యాసకృత మితి ? దేవీ భాగవతం శ్రీమద్ భాగవత మస్తి; నాన్యత్. కుత ఏతత్? శుద్ధత్వాత్ వేదాదిభ్యోఽ విరుద్ధత్వాచ్చ. అత ఏవ దేవీభాగవతస్య శ్రీమద్ భాగవత సంజ్ఞా. నాన్యస్య చ భాగవతస్య అశుద్ధత్వాత్ ప్రమత్త గీతత్వాచ్చ.

తెలుగు :- శ్రీమద్ భాగవత మను పేరుగల పురాణ మెయ్యది ? ఈ సందేహ మెందుకు కలిగినది ? రెండు భాగ వతములు విన నగుచున్నవి. ఒకటి దేవీభాగవతము, రెండవది కృష్ణభాగవతము. అందువలన వీనిలో నెయ్యది వ్యాస కృతమా యని సందేహము కలుగును. దేవీభాగవతమే శ్రీమద్భాగవతము. అదియే వ్యాసకృతము. మఱియొకటి కాదు. ఎందువలన ? శుద్ధమగుటవలన, వేదమునకు విరుద్ధము కానందువలన. అందువలననే దేవీభాగవతమునకే శ్రీమద్ భాగవతమని పేరు. ఇతర భాగవతము అశుద్ధము, ప్రమత్త గీతము నగుటవలన.

సం :- కించ తత్ "జన్మాద్యస్య యతోఽన్వయాద్ ఇతర శ్చార్థే ష్వభిజ్ఞః స్వరాట్" ఇత్యాది నిర్మితం యత్; కుత ఏత దశుద్ధమ్?

వేదాదిభ్యో విరోధాత్. కోఽస్తి విరోధః ? సర్వమేవ విరుద్ధమ్. కథమ్ ?

తెలుగు :- అశుద్ధము ప్రమత్తగీతము నగునది యేమి? 'జన్మాద్యస్య....' అని నిర్మించిన దంతయు నశుద్ధమే. అది యశుద్ధ మెందువలన ? వేదాదులకు విరుద్ధమగుట వలన; విరుద్ధ మెయ్యది ? అంతయు విరుద్ధమే. ఎట్లు ?

సం :- "న నానార్థం న భిన్నార్థం నాసంహతం న చాధికమ్, న న్యూనం కష్టశబ్దం చ వ్యుత్క్రమాభిహితం న చ"

"నాసత్య మతిసత్యం వా సూక్ష్మం సత్యప్రయోజనమ్, ఏతద్ దశదోషరహితం వాక్య ముచ్చార్యం లేఖనీయం చ."

* ఇత్యుక్తం మార్కండేయ పురాణే. ఏతద్దోషవదస్తి ప్రమత్త గీతం భాగవతమ్. అతోఽకథనీయ మశ్రవణీయం చ.

తెలుగు :- ఎట్లన – 'అనేకార్థములు గలది, భిన్నార్థములు గలది, సంక్షిప్తము, అధికము, న్యూనము, క్లిష్టశబ్దములు కలది, వ్యుత్క్రమము- క్రమము విడిచి చెప్పబడినది, అసత్యము, అతిసత్యము, అల్పసత్యము ప్రయోజనముగా గలది, అను నీ దశదోషములు లేని వాక్యమే ఉచ్చరించుటకు

---

* మార్కండేయ పురాణమున (1-18) 'మార్కండేయ! దశాష్ట దోషరహితో వక్తుం నిర్దేశ ఉపలభ్యతే- స్కందపురాణే కుమారికాఖండే :- "నవభిర్ నవభిశ్చైవ విముక్తం వాగ్విదూషణైః" ఇత్యుక్తమ్- ఉపలభ్యతే.

వ్రాయుటకు యోగ్యము.' అని మార్కండేయ పురాణమున చెప్పబడినది. కాని ప్రమత్త పురుషునిచే జెప్పబడిన యీ భాగవతము పై దోషములతో గూడియున్నది. కావున నియ్యది కథగా జెప్పదగినది, వినదగినది కాదు.

సం :- కథం తర్హి - శుక ఉక్తవాన్ ఇదం భాగవతం పరీక్షితం ప్రతి ఇతి ?

నోక్తవాన్, కుతో నోక్తవాన్ ? శుకస్తు యుద్ధాత్ పురా మోక్షం ప్రాప్తవాన్ ఇతి మహాభారతే శాంతి పర్వణి లిఖితమ్. (మ. భా. అధ్యా 333) అతోఽశుద్ధమేవ 'శుకః పరీక్షితం ప్రత్యుక్తవాన్' ఇతి. తర్హి ఛాయాశుకేన ప్రోక్త మితి? స తు గృహస్థో న నగ్నః (-సంన్యాసీ). వ్యాస ప్రోక్త మస్తి న వా ? నైవాంబరీష శుకప్రోక్తమ్.

'నిత్యం భాగవతం శృణు హయగ్రీవ శుకప్రోక్తమ్' నిత్యం భాగవతం శృణు ఇతి సర్వం కథన మశుద్ధమేవ.

తెలుగు :- (దశవిధ దోషములతో భాగవతము కూడిన దగుచో) శుకుడు (వ్యాసపుత్రుడు) భాగవతమును పరీక్షితునకు చెప్పినాడని యెట్లు చెప్పబడుచున్నది?(శుకుడు పరీక్షితునకు) చెప్పనే లేదు. ఎందువలన జెప్పలేదు ? శుకుడు (భారత) యుద్ధమునకు బూర్వమే ముక్తుడయ్యెను. ఇట్లు మహాభారతము శాంతి పర్వమున వ్రాయబడియున్నది. అందువలన శుకుడు పరీక్షితునకు జెప్పినాడనుట యశుద్ధమే. ఛాయా శుకుడు చెప్పియుండవచ్చు నేమో ! (అదియును సరికాదు) అతడు గృహస్థుడు (సంన్యాసి కాదు) వ్యాసప్రోక్తమును కాదు.

అంబరీష శుకుడును చెప్పలేదు. 'నిత్యం భాగవతం శృణు అనునిట్టి శ్లోకమున నిత్యము భాగవతమును వినుము అని చెప్పుట యంతయు నశుద్ధమే.

సం:- అన్యేఽపి దోషాః సన్తి న వా? సన్తి బహవో దోషాః, ఏకదోషవతోఽపి గ్రన్థస్య ప్రామాణ్యం న భవతి; కుతో బహు దోషవతశ్చ. తస్మాత్ స్థాలీ పులాక న్యాయవత్ ప్రమాద స్తావద్ ద్రష్టవ్యః.

తెలుగు :- ఇతర దోషములు నున్నవా లేవా ? చాల దోషములున్నవి. ఒక్క దోషమున్న గ్రంథమే ప్రమాణము కాదు. బహుదోషములున్న నది యెట్లు ప్రమాణము కాగలదు? కావున స్థాలీపులాక న్యాయముతో ప్రమాదము చూడదగును.

సం :- "జ్ఞానం పరమం గుహ్యం మే
యద్ విజ్ఞాన సమన్వితమ్
స రహస్యం తదఙ్గం చ
గృహాణ గదితం మయా."

పరమ గుహ్యం యదస్తి జ్ఞానం తద్ విజ్ఞానమేవ భవతి; పున ర్విజ్ఞాన సమన్విత మితీదం (విశేషణం) వ్యర్థ మేవ. ఏవం చ చతుశ్లో క్యశుద్ధాస్తి.

తెలుగు :- "జ్ఞానం పరమం గుహ్యం మే యద్ విజ్ఞాన సమన్వితమ్" 'విజ్ఞాన - సమన్వితమైన పరమ గుహ్యజ్ఞానము'

ఇట పరమ గుహ్యజ్ఞాన మనగా విజ్ఞానమే యగును. అందు వలన మరల నాపరమగుహ్య జ్ఞానమునకు విజ్ఞాన సమన్విత మను విశేషణము వ్యర్థము. ఇట్లే 'చతుశ్లోకీ- నాలుగు శ్లోకములు అశుద్ధములే.

"జన్మాద్యస్య యతోఽన్వయాది" భా. 2-1-30-34 యతః కుత ఇతి ప్రష్టవ్యః? కర్మణో వా కాలాద్, అహోస్విద్, ఈశ్వరాద్ వా కామాద్, అహోస్విద్ ప్రకృతేర్ వా బ్రహ్మణః. కించిదపి పూర్వం ప్రకృతం న దృశ్యతే. అత ఏవ సర్వమశుద్ధం కథనమ్.

తెలుగు :- "జన్మాద్యస్య యతః...." ఇట 'యతః' (దేనివలన) అను పద మెందులకు ? (దీని యభిప్రాయ మేమి?) అని ప్రశ్నింప దగియున్నది. కర్మవలన లేక కాలము వలన, లేక ఈశ్వరుని వలన, కామము వలన, లేక ప్రకృతి వలన, లేక బ్రహ్మము వలన ?-దీనికి పూర్వము ప్రకృతము-ప్రకరణ మేదియు నిర్దేశింప బడలేదు. కావున నీ కథన మంతయు నశుద్ధమే. (పూర్వము నిర్దేశింపబడిన దానికి బదులుగా సర్వనామ పదము ప్రయోగింపబడును. ఈ శ్లోకమునకు బూర్వము ప్రకరణ మేదియు (ప్రకృతము) నిర్దేశింపకయే దేనివలన అను అర్థముగల 'యతః' అను సర్వనామ పదము ప్రయోగించుట తగదని భావము.)

సం:- "భిక్షుభిర్ విప్రవసితే విజ్ఞానాదేష్టృభి స్తవ"వసిస్సం ప్రసారణీ ఇతి మహాభాష్యమ్. "సంవత్సరోషితో భిక్షుః ప్రాప్య

పుణ్యకృతాం ల్లోకాన్ ఉషిత్వా శాశ్వతీ సమాః" ఇత్యుదా
హరణమ్. విప్రవసిత ఇత్యశుద్ధ మేవ.

తెలుగు :- 'భిక్షుభిర్ విప్రవసితే....' వస = (నివాసే)
ధాతువు. సంప్రసారణ కార్యము గలది. అని మహాభాష్యమున
చెప్పబడినది. అందులకు ఉదాహరణములు :- సంవత్స
రోషితః ప్రాప్య.... ఉషిత్వా. ఈ యుదాహరణము లందు
ఉషితః, ఉషిత్వా, అని ప్రయోగములు చూపబడినవి. కావున
పై భాగవత శ్లోకమున 'విప్రవసితే' అని ప్రయోగించుట వ్యాక
రణ విరుద్ధమై యశుద్ధమగుచున్నది. 'విప్రోషితే' అని ప్రయో
గింప వలసినదని యభిప్రాయము.

సం :- "కథితో వంశవిస్తారో భవతా సోమ సూర్యయోః"
భా 10-1-1

"ప్రథనే వావశబ్దే" (అష్టా, 3-3-31) (ఇతి) శబ్దోపాధౌ
విస్తరః, అన్యత్ర విస్తార ఏవ, కోఽస్తి శబ్దోపాధిః? కథన శ్రవణే
"విస్తరేణాత్మనో యోగం, విభూతిం చ జనార్దన, భూయః
కథయ"
(భ, గీ,

"విభూతేర్ విస్తరో మయా" (భ, గీ,

"నాస్త్యన్తో విస్తరస్య మే", (భ, గీ,

"దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు" (భ, గీ,)

"నిశామయ తదుత్పత్తిం విస్తరాద్ గదతో మమ! ఏవం
సతి కథితో వంశవిస్తారో భవతా" ఇత్యశుద్ధమేవ.

తెలుగు :- ''కథితో వంశవిస్తారో"- "ప్రథనే వావశబ్దే" అను పాణినీయ సూత్రము ననుసరించి శబ్దము అభిధేయ మైనపుడు,'విస్తరము' ఇతర స్థలములందు 'విస్తారము' అని ప్రయోగించుట సమంజసము, సాధువు అగును. 'ఇట శబ్దో పాధి' యననేమి ? కథనము, శ్రవణము- (చెప్పుట వినుట) ప్రస్తుతశ్లోకమున సోమ సూర్య వంశములను గూర్చి చెప్పుట వినుట యనునది స్పష్టము. కావున విస్తార శబ్దప్రయోగ మశుద్ధము. 'విస్తర' శబ్దము ప్రయోగము చేయవలసి యుండెను.

విస్తరేణాత్మనో, విభూతేర్ విస్తరో మయా; నాస్త్యంతో విస్తరస్య మే; దైవో విస్తరశః ప్రోక్తః, నిశామయ తదుత్పత్తిం విస్తరాత్" అను భగవద్గీతా వాక్యములందును ఇతర స్థలము లందును 'విస్తర'శబ్దమే ప్రయోగించుట చూడనగును, కావున భాగవతమున 'కథితో వంశవిస్తారో' అని 'విస్తార' శబ్దమును ప్రయోగించుట అశుద్ధమని సుస్పష్టమగుచున్నది.

సం:- 'నిగమకల్పతరో ర్గలితమ్.'(భా.1-1-3)ఇత్యాది

అత్ర వేదనిందాకృతా హి, 'పతితమ్' ఇతి వక్తవ్యే 'గలితమ్' ఇత్యశుద్ధమ్, ఏకా షష్ఠీ, ద్వే పంచమ్యౌ వాఽత్రా శుద్ధమేవ. 'శృణుత' ఇతి వక్తవ్యే 'పిబత' ఇత్యశుద్ధమేవ.

తెలుగు :- 'నిగమకల్పతరో' అను నీ శ్లోకమున వేదము నిందింపబడినది, 'పతితమ్' పడిన అని ప్రయోగించుటకు బదులు (గలితమ్=కుళ్ళిన) అని అశుద్ధప్రయోగము చేయ

బడినది. (నిగమ కల్పతరోః) ఇందలి ఒకషష్ఠీవిభక్తి లేక (నిగమకల్పతరోః, శుకముఖాత్) రెండు పంచమీ విభక్తులు ప్రయోగించుట అశుద్ధమే. ఈశ్లోకమునందే 'శృణుత వినుము అని ప్రయోగించుటకు బదులు 'పిబత=త్రాగుము' అని ప్రయోగించుటయు అశుద్ధమే. ఇందు వేదవృక్షమునకు ఫలము భాగవతమనుటవలన భాగవతము శ్రేష్ఠమని భావము.

సం :- 'నేమం విరంచి ర్నభవో న శ్రీర ప్యంగసంశ్రయా ప్రసాదం లేభిరే గోపీ యత్తత్ ప్రాప ముక్తిదాత్ భా.10-9-20.

అత్రైకో నకారః సార్థకః. ద్వావనర్థకౌ స్తః. నిందా చ కృతా బ్రహ్మదీనాం దేవక్యాదీనాం చ.

తెలుగు :- 'నేమం విరంచి' అను నీ శ్లోకమున ఒక నకారము సార్థకము. మిగిలినవి రెండును అనర్థకములు-అర్థ రహితములు. బ్రహ్మదులయు, దేవక్యాదులయు నిందకూడ చేయబడినది.

సం :- "విప్రాద్ ద్విషన్ గుణయుతాదరవింద నాభ పాదారవిందముఖా చ్ఛ్వపదం వరిష్ఠమ్" (భా. 7-9-10)

అత్ర బ్రాహ్మణనిందా కృతా "అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మా మబుద్ధయః" (భ.గీ. 7-24) అస్మాద్ విరుద్ధత్వా దశుద్ధోఽపి.

తెలుగు :- 'విప్రాద్ ద్విషన్ గుణయుతాద్' అను నీ శ్లోకమున బ్రాహ్మణనింద చేయబడినది. అట్లే విష్ణువునకు

నాభిపాదాద్యవయవములు వర్ణించుట, 'అవ్యక్తుడనగు నన్ను మూర్ఖులు వ్యక్తునిగా నంగీకరింతురు' అను గీతావచనమునకు విరుద్ధమగుటచే అశుద్ధమే.

సం:- 'క ఉత్తమశ్లోక గుణానువాదాత్ పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాత్' (భా. 10-1-4)

అత్ర వేదవిహితకర్మ కర్తౄణాం నిన్దా కృతా. అర్థాత్ వేదానామపి. 'నాస్తికో వేదనిందకః' ఇత్యుక్తం మనునా. అత ఏవాయం భాగవతస్యాస్య కర్తా నాస్తికః.

తెలుగు :- ఈ శ్లోకము (క ఉత్తమశ్లోక....) న వేద విహితకర్మల నాచరించువారి నింద చేయబడినది. అర్థాపత్తితో వేదములను నిందించినట్లే యగుచున్నది. 'వేదముల నిందించు వాడు నాస్తికుడ'ని మనువు నుడివియున్నాడు. అందువలన నీ భాగవతకర్తయు నాస్తికుడే.

(ఉక్త శ్లోకమున- 'పరమయశస్వి యగువాని (కృష్ణుని) గుణానువాదము చేయుటకు - స్తుతించుటకు పశుఘ్నుడు - యాజ్ఞికుడు కాక మఱి యెవడు విముఖుడగును? అని వర్ణించుటలో 'పశుఘ్న' పదము వాడబడినది, పశుఘ్నుడన యాజ్ఞికుడని యర్థము, ఇట్లే 'గోఘ్న' పదమునకు అతిథి యని యర్థము, గోఘ్నుడన గోహింసకుడని కాదు, గోప్రాప్తి-గోవును పొందువాడని యర్థము. (ఇంటికి వచ్చిన యతిథికి గోవు నిచ్చుట పూర్వాచారము) లేక గో శబ్దమునకు గోవు వలన లభించు దుగ్ధాదులనియు నర్థము చెప్పవచ్చును. అతిథికి మధుపర్కము నిచ్చి సత్కరించుట వైదిక విధానము, మధుపర్కము అవుపెరుగు పాలు మున్నగువానితో నిర్మింపబడును.

2)

అట్లే యాజ్ఞికుడు పశుఘ్ను డనబడును. యజ్ఞార్థము వలయు ఘృతాదుల కొఱకు గోవులను పెంచును. కావున అట్టివాని నిందించుట యాజ్ఞికుని నిందించుటయే కాక వైదిక కర్మలను తన్మూలమున వేదమును నిందించినట్లే యగునని ఖండనకారుని యభిప్రాయము.

సం :- "యద్ వాగ్విసర్గో జనతాఘవిప్లవో యస్మిన్ ప్రతి శ్లోక మబద్ధవత్యపి" (భా. 1-5-11)

అసంబద్ధోఽయం శ్లోకః.

వ్యాసనారద సంవాదే వ్యాసస్యాపి నిందా కృతా:- వ్యాసః శోకాతురోఽభూత్. తత్ర నారద ఆగతః. పునర్ నారదేన బోధిత ఇతి: వ్యాసస్తు నారాయణావతారః తస్య కథం శోకః సంభవేత్ ?

తెలుగు :- 'యద్ వా విసర్గో' ఈ శ్లోకమే అసంబద్ధము (ఈశ్లోకములో ఉత్తరార్ధమున 'యశః సమన్వితనామము శ్రవణము చేయు విధానమున్నది. పూర్వార్ధమున వాణి - విసర్గము - వాణి - వ్యాపారము చెప్పబడినది వాణియొక్క వ్యాపారము లేనపుడు శ్రవణక్రియ కలుగనేరదు. శ్రవణక్రియ యున్నపుడు వాణియొక్క వ్యాపారాభావము అంగీకరించ వలనుకాదు. అందువలన శ్లోక మసంబద్ధమనబడినది'.

'వ్యాసుడు శోకాతురు డయ్యెను, అక్కడకు నారదముని వచ్చి వ్యాసుని శోకమును దూరమొనర్చెను.' అను వ్యాస నార దుల సంవాదమున వ్యాసుని నింద చేయబడినది,- వ్యాసుడు నారాయణుని యవతారమని (భా. ౧, 3, ౨౦, న వ్యాసుడు

నారాయణుని ౧౭ వ అవతారము) చెప్పుచుండ నతనికి శోక మెట్లు కలుగును ? కలుగజాలదు. కావున ఇదియు నశుద్ధమే.

సం:- ''భస్మాసుర కథాయాం శివస్యాపి నిందా కృతా:- భస్మాసుర భయాచ్ఛివః కైలాసం విహాయ వనం గతవాన్. పునర్ విష్ణునా రక్షితః ఇతి. కస్మాదపి త్రైలోక్యే భయం న భవతి శివస్య. యది కశ్చిద్ బ్రూయాద్ దత్తవరాయ భస్మాసురాయ దండం న దత్తవాన్, తర్హి రావణాయ దత్తవరాయ శివేన దండః కథం దత్తః? యస్య క్రోధవేశేన సర్వం పంచభూతాత్మకం జగత్ భస్మీభూతం భవతి - తస్య భయం కర్తుం కః సమర్థః పుమాన్ భవేత్ ? బాణాసుర కథాయామపి శంకరస్య నిందా కృతా, 'కృష్ణేన శంకరః పరాజితః ఇతి. కోఽపి శంకరం పరాజేతుం సమర్థో నాస్తి.

తెలుగు :- 'భస్మాసురునకు భయపడి శివుడు కైలాసమును విడిచి వనమున కేగెను.' తదుపరి విష్ణువతనిని రక్షించెను. అను నీ భస్మాసురుని కథయందు శివుడు నిందింపబడెను. ముల్లోకములందును శివున కెవరివలనను భయము కలుగనేరదు. 'భస్మాసురునకు వరము నిచ్చినందున శివుడతనిని దండింపలేదు' అని యెవరేని యందురేని, రావణునకు వరము నిచ్చి యతని నేల దండించినాడు? (అనియడిగిన సమాధానమేమి ?) శివుని యల్పక్రోధము వలననే పంచభూతాత్మకమగు నీ జగత్తంతయు ప్రళయమగును. అట్టివానిని భయపెట్టు సమర్థమానవు డెవడున్నాడు ?

బాణాసురుని కథయందును శంకరుని నింద చూపబడు చున్నది. అందు 'కృష్ణుడు శంకరు నోడించెను', శంకరు నెవరును పరాజితుం జేయజాలరు.

సం :- గృహస్థానామపి నిందా కృతా కపోతగురుకరణ కథాయామ్ 'గృహస్థాశ్రమోఽశ్రేష్ఠః' ఇతి.

''యథా నదీనదాః సర్వే
సాగరే యాన్తి సంస్థితిమ్
తథైవాశ్రమిణః సర్వే
గృహస్థే యాన్తి సంస్థితిమ్''. మ. 6-70

శ్రేష్ఠ ఏవ గృహస్థాశ్రమో వ్యవహారే. అతోఽశ్రేష్ఠ కథనం యత్ తత్ ప్రమత్తగీతమేవ.

తెలుగు :- కపోత గురుకరణ(పావురమును గురువుగా జేసికొనుట) కథలో 'గృహస్థాశ్రమము చెడ్డది' యని గృహస్థాశ్రమము నిందింపబడినది.

('పుష్ణన్ కుటుంబం కృపణః సానుబంధోఽవసీదతి' భా. 10-7-73 కృపణుడు కుటుంబమును పోషించుచు అనుబంధ సహితము నశించును'.)

'నదీనదములన్నియు సముద్రమున జేరి స్థిరము లగునట్లు బ్రహ్మచారులు, వానప్రస్థులు, సంన్యాసులు-మూడాశ్రమముల వారు గృహస్థాశ్రమము నాశ్రయించి జీవింతురు. వీరి యోగ క్షేమములు గృహస్థముపై నాధారపడియుండున'ని మనువు గృహస్థమును ప్రశంసింప భాగవతము గృహస్థ మశ్రేష్ఠమనుట

సరికాదని భావము. మనువు ననుసరించి వ్యవహారమున గృహస్థాశ్రమము శ్రేష్ఠము. దానిని అశ్రేష్ఠము-చెడ్డది యనుట ప్రమత్తవచనము.

సం :- 'కృష్ణస్యాపి నిందా కృతా రాసమండల చీరలీలా కథాయామ్' పరస్త్రీభిర్ లీలాకృతవాన్ నగ్నదారా దృష్టవాం శ్చేతి. (రాసమండల- భా. 10. 29-33; 10-24)

'అదత్తానా ముపాదానం హింసాచైవావిధానతః పరదారోప సేవా చ శారీరం త్రివిధం స్మృతమ్" పాప మితి శేషః.

(మ-17-7)

"నాగ్నిం ముఖేనోపధమేత్ నగ్నాం నేక్షేత చ స్త్రియమ్" ఇత్యాహ భగవాన్ మనుః అస్మాద్ విరోధా ల్లోకవిరోధాచ్చ ప్రమత్తగీత మేతత్. (మ. 4-13)

"అప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్ కిమభిప్రాయ ఏతన్నః సంశయం ఛిన్ధి సువ్రత."

(భాగ. 10-23-29)

అత్రాపి కృష్ణస్య నిందా కృతా. సర్వజ్ఞః కృష్ణః కదాచి జ్జుగుప్సితం కర్మ న కుర్యాత్.

సుభద్రాహరణ కథాయాం కృష్ణార్జున సుభద్రాణాం నిందైవ కృతా.

"కృష్ణః కపటరూపిణ మర్జునం మహాత్మాస్తీతి కథితవాన్ ఇతి. అర్జునః కపటరూపం కృతవాన్; సుభద్రాఽపి నిందితం కర్మ కృతవతీ" ఇతి.

తెలుగు :- రాసమండల, చీరహరణలీలా కథలలో 'పరస్త్రీలతో లీలలు జరిపినట్లు, నగ్న స్త్రీలను చూచినట్లు' వ్రాసి కృష్ణుని నిందించుట సుస్పష్టము.

"ఇయ్యని పదార్థములను గ్రహించుట, విధిరహితహింస, పరస్త్రీ సేవనము, ఈమూడును శారీరిక పాపములుగా చెప్పబడినవి. 'నోటితో అగ్నిని ఊదుట తగదు. నగ్నస్త్రీలను చూడరాదు'. అని మనువు చెప్పియున్నాడు. ఇట్లు మనుస్మృతికి విరుద్ధమగుటచేత, లోకవిరుద్ధ మగుటచేతను పై కథలలో చెప్పినదంతయు ప్రమత్తగీతమేవ.

'ఆప్తకామో-' అనునీశ్లోకము నందును కృష్ణుడు నిందింపబడినాడు. (పౌరాణిక దృష్టిననుసరించి)సర్వజ్ఞుడగు కృష్ణుడు ఎన్నడు నిందిత కర్మచేయజాలడు.

సుభద్రాహరణ కథయందును కృష్ణుడు, అర్జునుడు, సుభద్ర ముగ్గురు నిందింపబడినారు, 'కృష్ణుడు కపటవేషమును ధరించిన అర్జునుని మహాత్ముడని చెప్పినాడు. అర్జునుడు కపటవేషమును ధరించెను. సుభద్రయు నిందిత కర్మ నొనర్చెను' అని.

సం :- ఇంద్రస్యాపి 'గోవర్ధనోద్ధరణ కథాయాం' నిందా కృతా. "ఇంద్రో లజ్జితో బభూవ" ఇతి- "అష్టాశీతి సహస్రాణా మృషీణాం మహత్మనాం నిందైవ కృతా 'సప్తాహోత్థాన కథాయాం' తేషాం మధ్యే ఏకోఽపి పరీక్షితం సమాధాతుం సమర్థో నేతి.

బ్రహ్మణోఽపి 'వత్సహరణ హంసావతరణ కథాయాం నిందైవ కృతా 'అజ్ఞానీ బ్రహ్మ' ఇతి.

"తతః పుష్కరతః సృష్టస్సర్వజ్ఞో మూర్తిమాన్ ప్రభుః
బ్రహ్మ వేదమయః సాక్షాత్ ప్రజాపతి రనుత్తమః"

(భా. 1-14-10)

ఇతి మహాభారతవిరోధాత్ ప్రమత్తగీత మేతత్.

తెలుగు :- గోవర్ధనోద్ధరణ కథ యందు' ఇంద్రుడు లజ్జితుడయ్యెను" అని ఇంద్రుని నిందయు జేయబడినది.

సప్తాహోత్థాన కథయందు "వారిలో నొక్కడును పరీక్షితుని శంకకు సమాధానము చెప్పుటకు సమర్థుడుకాలేదు' అని ఎనుబది యెనిమిదివేల ఋషులయు మునులయు నిందచేయబడినది.

వత్సహరణ హంసావతరణము నను కథలో 'బ్రహ్మ అజ్ఞాని' అని నిందింపబడినది. తదుపరి కమలరూప పృథివిని సృష్టించిన మీదట సర్వజ్ఞుడు శరీరధారియు, సాక్షాత్ వేదమయుడు, శ్రేష్ఠతముడు, ప్రజాపతి, ప్రభువునగు బ్రహ్మను సృష్టించెను. అను మహాభారత వచనమునకు 'బ్రహ్మ అజ్ఞాని' అను భాగవతవచనము విరుద్ధమగుటచే నిది ప్రమత్త గీతమే యగుచున్నది.

సం :- 'ధర్మేచార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ'
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్?

(మ. భా. ఆది.... 62-53)

మహాభారతాద్ విరుద్ధం యత్తన్న వ్యాసప్రోక్తమితి మహాభారతే. ఇదం తు భాగవతం మహాభారతాద్ విరుద్ధమేవాస్తి'. తస్మాత్ ప్రమత్తగీతమేవ.

తెలుగు :- 'ఓ భరతర్షభ ! ధర్మార్థకామ మోక్ష విషయ ములలో (నీమహాభారతమున)నిందేమి చెప్పబడినదో యదియే యన్యగ్రంథములలో నున్నది. ఇందు లేనిది యెందునులేదు. అను నీ వచనము ననుసరించి మహాభారతమునకు విరుద్ధ ముగా జెప్పునది వ్యాసుని కథనము కాదు. ఇట్లు మహాభారత మున చెప్పబడినందున ఈభాగవతము భారతమునకు విరుద్ధమై యగుచున్నది. కావున ప్రమత్త గీతమే యననగును.

సం :- "వందే మహాపురుషచరణారవిందమ్"

భా. 11-5-33

''ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి ఖం వై నాభిం సోమ సూర్యౌ చ నేత్రే దిశః శ్రోత్రే యస్య పాదౌ క్షితిశ్చ 1.
ధ్యాతవ్యోఽసౌ సర్వభూతాంతరాత్మా"

''యద్ వాచా నాభ్యుదితం, యేన వాగభ్యుద్యతే తదేవ 2.
బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే''

''యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ తదేవ కేన. 1-5
బ్రహ్మ త్వం విద్ధినేదం యదిదముపాసతే''

ఇత్యాదిభ్యః శ్రుతిభ్యో విరుద్ధమేవ చరణారవింద వంద నాదికమ్. అతోఽకథనీయ మశ్రవణీయం చేదం ప్రమత్తగీతం భాగవతమ్.

తెలుగు :- 'వందే' ఓమహాపురుష ! నీచరణారవిందము లకు ప్రణామము చేయుచున్నాను' అను నీ కథనము కూడ

'ద్యాం మూర్ధానం'....ద్యులోకము నెవనికి శిరస్సుగాను, ఆకాశము నాభిగాను, చంద్రసూర్యులు రెండు నేత్రములు

గాను, దిక్కులు శ్రోత్రములుగాను, పృథివి పాదములుగాను, విప్రులు చెప్పుదురో ఆ సర్వభూతాంతరాత్మ ధ్యానము చేయ దగినవాడు. ''యద్వాచా" వాక్కుచే నెయ్యది చెప్పబడదో, దేనిశక్తి మూలమున వాణి మాటాడగలుగునో యదియే బ్రహ్మ మనియు నీవుపాసించునది బ్రహ్మము కాదనియు తెలిసి కొనుము.

"యన్మనసా...." ఏది మనస్సుతో విచారింప నను వు కాదో, దేని మూలమున మనస్సునకు మననశక్తి లభించునో యదియే బ్రహ్మమనియు నితరము నీవు ఉపాసించునది కాదనియు నెఱుగుము.

చరణారవింద వందనాదికము ఉపర్యుక్త శ్రుతి వచన ములకు విరుద్ధము. కావున నీ ప్రమత్త గీతమగు భాగవతము కథగా జెప్పరాదు, వినదగదు.

సం :- పూర్వాపర విరుద్ధ మప్యస్తి :-

నృసింహేన ప్రహ్లాదాయ వరో దత్తః. 'ఏకవింశతి పిత్రాద్యా స్తవ మోక్షం గచ్ఛన్తు'. పున రుక్తం ప్రమత్తేన.

'తావేవ రావణకుంభకర్ణౌ బభూవతుః' 'పున స్తావేవ శిశుపాలద న్తవక్త్రౌ బభూవతుః' ఇతి చ విరుద్ధమేవ.

తెలుగు:- (భాగవతమున)పూర్వాపర విరుద్ధము కలదు. 'నీతండ్రి మున్నగువారు '21మంది మోక్షమును పొందుదురు గాక' అని నృసింహుడు ప్రహ్లాదునకు వరమిచ్చెనని చెప్పి, ప్రమత్తునిచే మరల నిట్లు చెప్పబడినది. (హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు) అను నిరువురు రావణ కుంభకర్ణులైరి. మరల

3)

వారిరువురే శిశుపాల దంతవక్త్రులైరి." అని. ఇది పరస్పర విరుద్ధము. (ముక్తులైనవారు జన్మించుట విరుద్ధము)

సం :- 'భవాన్ కల్పవికల్పేషు న విముహ్యతి కర్హిచిద్ (భా. 2-9-36)

ఇతి బ్రహ్మణే వరో దత్తో నారాయణేన. పునరుక్తమ్- 'బ్రహ్మ మోహితో భూత్వా వత్సహరణం కృతవాన్.' ఇతి విరుద్ధమేవ.

తెలుగు :- భవాన్- 'నీవు కల్పము-సృష్టి. వికల్పము-ప్రళయములలో నెన్నడును మోహమును బొందవు' అని నారాయణుడు బ్రహ్మకు వరము నిచ్చెను. అని చెప్పి మరల నిట్లనెను. 'బ్రహ్మ మోహితుడై (గోపకుల) గోవత్సములను హరించెను అని. ఇదియు విరుద్ధమే. (భా. 10-14-60)

సం :- 'కృష్ణో నగ్నాం బాణాసురమాతరం న దృష్టవాన్' (భా. 10-63-20-21) పునరుక్తం ప్రమత్తేన 'చీరలీలాం కృతవాన్' ఇతి. (భా. 10-22-17-20) విరుద్ధమేవ.

తెలుగు :- 'కృష్ణుడు బాణాసురుని నగ్నయగుమాతను చూడలేదు. అని చెప్పినాడు. ('తన్మాతా కోటరా నామ నగ్నా ముక్తశిరోరుహా....తత స్తిర్యఙ్ముఖో నగ్నా మనిరీక్షన్ గదాగ్రజః) మఱియు (అందు స్నానమాడుచున్న స్త్రీలవస్త్రములను తీసికొని, వారిని నగ్నలగా బయటికి వచ్చుటకు బలవంతము చేసినాడు కృష్ణుడు)అని చీరహరణలీల(భా.10-22-17-20) వర్ణించియున్నాడు. ఇదియు విరుద్ధమే.

సం :- భస్మాసురకథాయాం శివస్య నిందాం కృత్వా పున ర్విషపాన కథాయాం 'భవానేవ విష్ణ్వాదీనా మీశ్వరః' ఇతి విరుద్ధమేవ. (భా. 10-88, భా. 8-7-20-45 భా. 8-7, 21-37)

తెలుగు :- భస్మాసురుని కథయందు శివుని భీరునిగా చిత్రించి, మరల విషపాన కథయందు శివుని 'నీవే విష్ణువు మున్నగువారికి ఈశ్వరుడవు' అని స్తుతియించినాడు. ఈవర్ణన పరస్పర విరుద్ధము కాక మఱి యేమగును ?

సం :- 'ఋతే జ్ఞానా న్నముక్తిః' ఇతి శ్రుతేః, 'న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' (భగ. 4-38), ఇతి స్మృతేశ్చ; ఏవం సతి 'భక్తి రేవ మోక్షదాత్రీ' భాగవత మాహాత్మ్యం-6 అ-83 శ్లో, 'భక్త్యా విముచ్యే న్నరః'. ఇతి వేదాదిభ్యో విరుద్ధమేవ. (భా 11-14-18)

తెలుగు :- జ్ఞానములేక ముక్తి కలుగదని శ్రుతియు, ఈ లోకమున జ్ఞానముతో సమానమగు పవిత్రమైన వస్తువు మఱియొకటి లేదని గీతాస్మృతియు చెప్పుచుండ, భాగవత మున 'భక్తియే మోక్షదాయకమ'ని వర్ణించుట వేదాదులకు విరుద్ధమే యగును.

సం :- అతః కుగ్రంథస్య భాగవతాఖ్యస్యాస్య కర్తా మూర్ఖ ఏవ. అస్మాత్ కారణాత్ సుఖేప్సుభిః కదాచి దిదం ప్రమత్త గీతం న కథనీయం న శ్రోతవ్యం చేతి సిద్ధాన్తః. యే తు లోభా

బ్రవీమి-నేను చెప్పుచున్నాను- వయం బ్రూమః-మేము చెప్పు చున్నాము అని ఒకవ్యక్తి కూడ ప్రయోగింపవచ్చును. కావున శిష్యాభి ప్రాయముతో బహువచనమని చెప్పుట అశుద్ధమే యగును.

సం :- "అన్యకృతమితి న శంకనీయమ్' ఇత్యుక్తం శ్రీధరేణ. 'ప్రాప్తౌ సత్యాం నిషేధః' అతో ఽన్యకృతమేవ.

నాయం శ్రీధరనామా. కస్తర్హి ? దరిద్రాధరనామైవాస్తి. కుతః? మూర్ఖత్వాత్.కిం బహునా లేఖన. శ్రీధరాదీనాం జ్ఞానమేవ నాస్తి వేదాదిషు: ఇతి స్థాలీపులాకన్యాయవ ల్లేఖనం కృత మస్మాభిః. తద్ యుష్మాభిర్ వేదితవ్యమ్- సర్వం భాగవత మశుద్ధమితి.

తెలుగు :- 'ఈభాగవతము అన్యకృతము, కాదు.' వ్యాస కృతము అని శ్రీధరుడు వ్రాసియున్నాడు. కాని భాగవతము వ్యాసకృతము కాదు; అన్యకృతమే యని శ్రీధరుని వాక్యము వలననే తెలియుచున్నది. 'ప్రాప్తి కలిగినపుడే నిషేధింపబడు' నను లౌకికన్యాయము ననుసరించి భాగవత మితరునిచే వ్రాయబడినదని శంకించినపుడే శంకింపజనదని నిషేధింప బడుట లోకసిద్ధము.

ఈ భాగవత టీకాకర్తయు (శ్రీధరుడు - లక్ష్మి - విద్యాధరుడు) శ్రీధరనామము కలవాడు కాడు. దరిద్రాధరుడే (దారిద్ర్యం=మౌర్ఖ్యం. దానిని ధరించువాడు) ఐ యుండును. ఎక్కువ వ్రాసిన ప్రయోజనమేమి ? శ్రీధరాదులకు వేదాదు

లందు జ్ఞానమే లేదు. అని స్థాలీపులాక న్యాయము ననుసరించి మాచే కొంచెమే వ్రాయబడినది. భాగవతమంతయు నశుద్ధమే యని మీరు తెలిసికొనుడు.

సం :- బ్రాహ్మణ క్షత్రియ విట్ శూద్రా వర్ణాః, బ్రహ్మచారి, గృహి, వని, సంన్యాసిన ఆశ్రమాశ్చ జ్ఞాతవ్యాః; ఏషాం వేదేషు మనుస్మృతౌ చ ధర్మా ఉక్తాః. ఏభ్యో యే విరోధిన స్తే పాషండిన ఏవ కిం లక్షణాస్తే ? చక్రాద్యంకన కేవలోర్ధ్వ పుండ్ర కాష్ఠమాలాధారిణః, తప్తముద్రోర్ధ్వపుండ్రే ద్వే నరక వాససాధనే. తస్మాత్ త్యాజ్య మనర్థం ద్విజైర్ నరకభీరుభి రితి జాబాలిః"

"విభూతిధారణం త్యక్త్వా త్యక్త్వా రుద్రాక్షధారణమ్ మాం మా పూజయ విశ్వేశం శివలింగరూపిణమ్" ఇత్యాహ విష్ణుపురాణే.

'యజ్ఞో వై విష్ణుః' ఇతి శ్రుతేర్ యజ్ఞకర్తా వైష్ణవో నాన్యః.

తెలుగు :- బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములు, అట్లే బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సంన్యాసి అను నాలుగు ఆశ్రమములు తెలిసికొనవలయును. వీని ధర్మములు వేదములందును మనుస్మృతి యందును వర్ణింపబడినవి. వానికి విపరీతముగా నుండువారు పాషండులే. వారి లక్షణము లెయ్యవి ?

చక్రాంకితులగుట : ఊర్ధ్వ పుండ్రముల ధరించుట, తులసికాష్ఠముచే జేయబడిన మాలాధారణము మున్నగు లక్ష

ణము లన్నియు పాషండలక్షణములే. తప్తముద్రలు, ఊర్ధ్వ పుండ్రములు నరకవాసమునకు సాధనములు. కావున నివి త్యాజ్యములు. నరకమునకు భయపడు ద్విజులు వీనిని ధరింప రాదు. అని జాబాలి.

విష్ణుపురాణమున :

'విభూతిధారణ, రుద్రాక్షధారణ విడిచి శివలింగరూపుడ నగు విశ్వేశుడనైన నన్ను పూజింపకుము' అని చెప్పబడినది.

'యజ్ఞమే విష్ణువని శ్రుతి చెప్పుచున్నందున యజ్ఞ మొనర్చువాడే వైష్ణవుడు-ఇతరుడు కాదు.

సం :- బృహన్నారదీయే పురాణే ధర్మభగీరథ సంవాదే భగీరథం ప్రతి ధర్మరాజ వాక్యమ్-"యస్తు సంతప్త ప్రశంఖాది లింగాంకిత తను ర్నరః స సర్వయాతనాభాగీ చాండాలః కోటి జన్మసు. ఏతల్లక్షణాః పాషండినః. యే తు పాషండి మత విశ్వాసిన స్తేఒపి.

"పాషండినో వికర్మస్థాన్ బైడాలవ్రతికాన్ శఠాన్ హైతు కాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్" ఇత్యాహ మనుః. అత ఏవ వాఙ్మాత్రేణాపి పాషండిభి స్సహ వ్యవహారో న కర్తవ్యః.

తెలుగు:- బృహన్నారదీయ పురాణమున ధర్మభగీరథుల సంవాదమున భగీరథుని గూర్చి ధర్మరాజు చెప్పిన వచనము-

బాగుగ కాల్చిన శంఖాదులవలన అంకితము చేయబడిన (ముద్రలు వేయుబడిన) శరీరముగల మనుష్యుడు సర్వదుఃఖ

ముల ననుభవింపవలసినవాడై కోటిజన్మలవఱకు చాండాలు డగును? ఇట్టి లక్షణములు కలవారే పాషండులు-పాషండుల మతమును విశ్వసించువారును పాషండులే.

"పాషండులు, దుష్కర్మల నాచరించువారు, బిడాల వ్రతులు, శఠులు, కుతార్కికులు, కొంగవంటి భక్తులు నగు వారిని మాటలతోనైన సత్కరింపరాద"ని మనువు చెప్పు చున్నాడు. అందువలన పాషండులతో వాగ్వ్యవహారమైనను చేయుదగదు.

సం:- పాషాణాది మూర్తిపూజనం పాషండి మతమేవ. కుత ఏతత్ ? వేదాదిభ్యో విరోధాత్.

"యద్ వాచా నాభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే. "యన్మనసా న మనుతే యేనాహుర్ మనోమతమ్ తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే" "యత్ ప్రాణేన న ప్రాణతే యేన ప్రాణః ప్రణీయతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే" ఇత్యాది శ్రుతిభ్యః, అత ఏవ పాషాణాది కృత్రిమ మూర్తిపూజనం వృథైవ.

"అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః"

ఇతి భగవద్ గీతావచనమ్.

కిం బహునా లేఖేన; ఏతావతైవ సజ్జనైర్ వేదితవ్యమ్-విదిత్వా ఆచరణీయ మేవ.

దయానంద సరస్వత్యాఖ్యేన స్వామినా నిర్మిత మిదం పత్రం వేదితవ్యం విద్వద్భిరితి. శుభం భవతు వక్తృభ్య శ్రోతృభ్యశ్చ.

వేదోపవేద వేదాంగ మనుస్మృతి మహాభారత హరివంశ పురాణానాం వాల్మీకి నిర్మితస్య రామాయణస్య చాధ్యాపన మధ్యయనం కర్తవ్యం కారయితవ్యం చ. ఏతేషామేవ శ్రవణం కర్తవ్య మితి.

తెలుగు :- జాళ్లు మున్నగువానిచే జేయబడిన విగ్రహ ముల పూజించుట పాషండుల మతమే. కారణమేమన ? వేదాదులకు విరుద్ధమగుటచేతనే.

"ఏది వాణిచే వర్ణింప నలవికాదో దేనిచే వాణి మాటలాడ సమర్థమగుచున్నదో అదియే బ్రహ్మమని యెఱుంగుము. నీవు ఉపాసించునది కాదు."

"ఏది మనస్సుతో నాలోచింప నలవికాదో, దేనిమూలమున మనస్సునకు ఆలోచించు శక్తి కలుగుచున్నదో అదియే బ్రహ్మము...."

"ప్రాణవాయువు వలన జీవింపక, దేని మూలమున ప్రాణము గతికలది యగుచున్నదో యదియే బ్రహ్మము; నీవు ఉపాసించునది కాదు.

మున్నగు శ్రుతులకు విరుద్ధమగుట వలన కృత్రిమము లగు జాతి విగ్రహముల పూజించుట వ్యర్థమే.

"మూర్ఖులు వ్యక్తముకాని నన్ను వ్యక్తుడనని యెంచు చున్నారు" అను గీతావచనమునకు విరుద్ధమగుటచే విగ్రహ పూజనము చేయరాదని భావము. ఎక్కువ వ్రాసి యేమి ప్రయోజనము? ఈవ్రాసిన దానిని బట్టియే సజ్జనులు తెలిసి కొని యాచరింపవలయును.

ఈ'విజ్ఞాపన పత్రమును దయానంద సరస్వతీస్వామి వ్రాసెను'- అని విద్వాంసులు తెలిసికొనవలయును. ఈవిషయ మును చెప్పువారికి వినువారికి శుభము కలుగుగాక !

వేదములు, ఉపవేదములు, వేదాంగములు, మనుస్మృతి, మహాభారతము, హరివంశపురాణము, వాల్మీకి నిర్మిత రామా యణము నను వాని పఠనపాఠనములు, శ్రవణ శ్రావణములు జరుగవలయును.

శ్రీమద్దయానంద స్వామినా విరచితస్య భాగవత ఖండ నస్య పండిత గోపదేవ విరచిత ఆంధ్రభాషానువాదః సమాప్తః.

దయానంద ఉపదేశక మహావిద్యాలయః
పింగళనామ సం. కార్తీక బహుళ దశమీ,

గోపదేవ్
ఆచార్యులు-దయానంద ఉపదేశక మహావిద్యాలయము
మలకపేట - హైదరాబాద్.